# శ్రీ సూర్యాష్టకము

ఇది

పఠించువారికిని వినువారికిని

సకలరోగములను, సకలగ్రహబాధలను

నిర్మూలము చేయునదిగాన

---

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి

అయ్యవారలుంగారిచే

రచియింపంబడిన టీకతోంజేర్చి

చికట్ల రామచంద్రయ్య నాయుడుగారి

యుద్దేశమునను సరించి

స్త్రీబాలవృద్ధులకు స్పష్టముగాం దెలియు

టకు గొడవర్తి వెంకటజగన్నాథాచా

ర్యులచేత విశాఖపట్టణమునందలి ఆర్ష

ముద్రాశాలయందు ముద్రింపించి

ప్రచురింపంబడెను.

Publisher G. V. Jagannadhacharier
Printer. D. Gurabaa.
ARSHA PRESS. VIZAGAPATAM.
1892.

# శ్రీ సూర్యాష్టకమ్.



సాంబోవాచ-

ఆదిదేవ నమ స్తుభ్యం
ప్రసీద మమ భాస్కర।
దివాకర నమ స్తుభ్యం
ప్రభాకర నమోస్తు తే॥౧॥

సప్తాశ్వరథ మారూఢం
ప్రచణ్డం కశ్యపాత్మజమ్।
శ్వేతపద్మధరం దేవం
తం సూర్యం ప్రణమా మ్యహమ్॥౨॥

లోహితం రథ మారూఢం
సర్వలోకపితామహమ్।
మహాపాపహరం దేవం
తం సూర్యం ప్రణమా మ్యహమ్॥౩॥

# శ్రీ సూర్యాష్టకటీక.



సాంబః ఉవాచ = సాంబుఁడుపలికెను.

౧ ఆదిదేవ తుభ్యం నమః = దేవతలలో మొదటివాఁడా నీకు నమస్కారము. భాస్కర మమ ప్రసీద = ప్రకాశించువాఁడా నాకు ప్రసన్నుఁడవు కమ్ము. దివాకర తుభ్యం నమః = పగలును చేయువాఁడా నీకు నమస్కారము. ప్రభాకర తే నమః అస్తు = వెలుగును గల్గఁజేయువాఁడా నీకు నమస్కారము అగుఁగాక.

౨ సప్తాశ్వరథమ్ ఆరూఢమ్ = ఏడుగుఱ్ఱములుగల రథమును ఎక్కినవాఁడును, ప్రచణ్డం కశ్యపాత్మజం శ్వేతపద్మధరం దేవమ్ = తీక్ష్ణుఁడైనవాఁడును కశ్యపునికొడుకును తెల్లనిపద్మమునుధరించినవాఁడును దేవుఁడునగు, తం సూర్యమ్ = ఆ సూర్యుని, అహం ప్రణమామి = నేను నమస్కరింపుచున్నాను.

3 లోహితం రథమ్ ఆరూఢమ్ = ఎఱ్ఱని రథమును ఎక్కినవాఁడును, సర్వలోకపితామహం మహాపాపహరం దేవమ్ = అన్నిలోకములను సృజించినవాఁడును గొప్పపాపములనుపోఁగొట్టువాఁడును

త్రైగుణ్యాచ్ఛ మహాశూరం
బ్రహ్మవిష్ణుమహేశ్వరమ్।
మహాపాపహరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహమ్॥౪॥

బృంహితతేజఃపుఞ్జంచ
వాయుమాకాశమేవ చ।
ప్రభుం త్వం సర్వలోకానాం
తం సూర్యం ప్రణమామ్యహమ్॥౫॥

బన్ధూకపుష్ప సంకాశం
హారకుణ్డలభూషితమ్।
ఏకచక్రధరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహమ్॥౬॥

దేవుఁడై నగు, తం సూర్యమ్= ఆ సూర్యుని, అహం
ప్రణమామి= నేను నమస్కరించుచున్నాను.
౪ మహాశూరం= గొప్పశూరుఁడైనవాఁడును,
త్రైగుణ్యాత్ బ్రహ్మవిష్ణుమహేశ్వరం చ= రజస్సు స
త్త్వము తమస్సులనెడు గుణముల మూఁటివలనను బ్ర
హ్మవిష్ణుశివుఁడైనవాఁడును, మహాపాపహరం దే
వమ్= గొప్పపాపములను పోఁగొట్టువాఁడును దేవుఁ
డునగు, తం సూర్యం= ఆ సూర్యుని, అహం ప్రణ
మామి= నేను నమస్కరించుచున్నాను.

౫ వాయుమా ఆకాశమేవచ బృంహితతేజఃపు
ఞ్జం చ= వాయువులోనను ఆకాశములోనను విస్త
రింపఁజేయఁబడిన తేజస్సుయొక్క సమూహముగల
వాఁడును, సర్వలోకానాం త్వం ప్రభుం= అన్ని
లోకములకును మఱియొక్క ప్రభువైనవాఁడునగు,
తం సూర్యమ్= ఆ సూర్యుని, అహం ప్రణమామి=
నేను నమస్కరించుచున్నాను.

౬ బన్ధూకపుష్పసంకాశం హారకుణ్డలభూషి
తమ్ ఏకచక్రధరం దేవమ్= మంకెనపువ్వువలెఎఱ్ఱ
గానున్నవాఁడును హారములుకుండలములువీనిచేత
అలంకరింపఁబడినవాఁడును ఒక్కచక్రమునుధరిం
చినవాఁడును దేవుఁడునగు, తం సూర్యమ్= ఆ సూ

తం సూర్యం లోకకర్తారం
మహాతేజః ప్రదీపనమ్।
మహాపాపహరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహమ్॥౭॥

తం సూర్యం జగతాం నాథం
జ్ఞానప్రకాశ మోక్షదమ్।
మహాపాపహరం దేవం
తం సూర్యం ప్రణమా మ్యహమ్॥౮॥

సూర్యాష్టకం పఠే న్నిత్యం
గ్రహపీడాప్రణాశనమ్।
అపుత్రో లభతే పుత్రం

ర్యుని, అహం ప్రణమామి— నేను నమస్కరింపుచు
న్నాఁడను.

లోకకర్తారం మహాతేజః ప్రదీపనం తం
సూర్యమ్= లోకములకుకర్తయైనవాఁడును గొప్ప
తేజస్సుచేత ప్రకాశింపఁజేయువాఁడునగు ఆ సూ
ర్యుని, అహం ప్రణమామి =నేను నమస్కరింపు
చున్నాఁడను. మహాపాపహారం దేవం తం సూ
ర్యమ్— గొప్పపాపములనుపోఁగొట్టువాఁడును దే
వుఁడునగు ఆ సూర్యుని, అహం ప్రణమామి— నేను
నమస్కరింపుచున్నాఁడను.

౬ జగతాం నాథం జ్ఞానప్రకాశమోక్షదం
తం సూర్యం — జగత్తులకు అధిపతియైనవాఁడును
జ్ఞానపువెలుగును మోక్షమునునిచ్చువాఁడునగు ఆ
సూర్యుని, అహం ప్రణమామి= నేను నమస్క
రింపుచున్నాఁడను. మహాపాపహరం దేవం తం
సూర్యమ్ = గొప్పపాపములనుపోగొట్టువాఁడును
దేవుడునగు ఆ సూర్యుని, అహం ప్రణమామి =
నేను నమస్కరింపుచున్నాఁడను.

౭ గ్రహపీడాప్రణాశనం సూర్యాష్టకమ్= గ్ర
హబాధనుపోఁగొట్టెడి సూర్యాష్టకమును, నిత్యం
పఠేత్ — ప్రతిదినంబును పఠించునది. అపుత్రః పు

దరిద్రో ధనవాన్ భవేత్ ॥౯॥

ఆమిషం మధుపానంచ
యః కరోతి రవేర్దినే।
సప్తజన్మ భవే ద్రోగీ
జన్మజన్మ దరిద్రతా॥౧౦॥

స్త్రీతైల మధు మాంసాని
యే త్యజన్తి రవే ర్దినే।
న వ్యాధి శ్శోక దారిద్ర్యం
సూర్యలోకం స గచ్ఛతి॥౧౧॥

ఇతి సామ్బపురాణే రోగాపనయనే
సూర్యాష్టకం సమాప్తి
శుభమస్తు.

త్రం విన్దతే- కొడుకులు లేనివాఁడు కొడుకులను పొందును- దరిద్రః ధనవాన్ భవేత్ - దరిద్రుఁడు ధనవంతుఁడు అగును.

౧౦ ఆమిషం మధుపానంచ = మాంసము తినుటనును మద్యమును త్రాగుటనును యః రవేః దినే కరోతి - ఎవ్వఁడు సూర్యుని దినమున (ఆదివారమున) చేయునో, (సః) సప్తజన్మ రోగీ భవేత్- (వాఁడు) ఏడుజన్మములు రోగములుగలవాఁడై ఉండును- జన్మజన్మ దరిద్రతా భవేత్ = ప్రతిజన్మంబును దారిద్ర్యము కలుగును.

౧౧ స్త్రీతైలమధుమాంసాని = స్త్రీ సంగము ముతలంటుకొనుట మద్యముమాంసము అనువానిని, యే రవేః దినే త్యజన్తి - ఎవ్వరు సూర్యుని దినమున(ఆదివారమున) విడుతురో (తేషాం) వ్యాధిః న(భవతి)-(వారలకు) రోగము (కలుగదు) శోకదారిద్ర్యమ్.(నభవతి) దుఃఖంబును దారిద్ర్యంబును (కలుగదు). సః సూర్యలోకం గచ్ఛతి = వాఁడు సూర్యలోకమును పొందుచున్నాఁడు.

ఇట్లు సాంబపురాణమున రోగములను పోగొట్టెడి భాగమున సూర్యాష్టకము సమాప్తిని పొందెను.

